# లక్ష్మీకాంతం కేసు

## శ్రీ రాజమన్నారుగారి వాదం

అడ్వొకేట్ జనరల్ రాజమన్నార్ గారు ప్రాసిక్యూషను వాదాన్ని సాగిస్తూ ఇల్లా చెప్పారు:— డిఫెన్సువారు పెరేడులు ఫార్సులన్నారు. పెరేడులే ఫార్సులైతే అక్టోబరు 19 వ తేదీన జరిగిన పెరేడులో వడివేలును దొరైకణ్ణు గుర్తించకపోవటం ఎందుకు జరుగుతుంది? డాక్టర్లను, పాలవాళ్లను, అడ్వొకేటును- రిక్షావాణ్ణి తెచ్చి కుట్రజరిపి ప్రాసిక్యూషనువారు సాక్ష్యాన్ని సృష్టించారనటం న్యాయమా? ఫలాన వాళ్లను చూశామని పాలవాళ్లు చెప్పారు. రామన్న సాక్ష్యాన్ని మీరు నమ్మినట్లయితే శీనన్ అపరాధి అనే చెప్పాలి. కృష్ణన్ భాగవతర్‌లను గూర్చి జయానందం చెప్పింది అతను అప్రూవరు అయినందువల్ల త్రోసివెయ్య నవసరం లేదు. అది సాక్ష్యంగ పరిగణించరాదన్నా దాని తాత్పర్యాన్ని మీరు గమనించాలి. రామన్న చెప్పిన దాన్ని జయగారి బాగా బలపరచింది.

జయానందం, నాగలింగం, రాజాబాదరులను పసువులపాక దగ్గర చూశానని మునుస్వామి పరుగెత్తుతుండగా చూశామని చిట్టిబాబూ, మదనగోపాలు చెప్పారు. వడివేలును గోపాలు గుర్తించాడు. సి. ఐ. డి. దూరంగా ఉంచటంవల్ల ఎవరికీ కనిపించటానికి సాధ్యం గాకపోవచ్చు. చంపి వచ్చాక రామన్నతో వచ్చి శీనన్ ఎందుకు చెప్పాలని మా మిత్రులు అన్నారు. బెజవాడ దంతా రామన్న దగ్గిర దింపుకుందామని అతను రాకపోవచ్చు. కుస్తీ వస్తాదవటంవల్ల బడాయిలు చెప్పుకోవటం అసహజంగాదు. పైగా చూపటానికి భయంకరంగా కనిపించాడని రామన్న అన్నాడు. 'హాకీ పసింగళ్' అంటే అచ్చంగా 'అనామకులు' అని అర్థంకాదు. అతను వ్రాసిన ఉత్తరం అతని సాక్ష్యాన్ని బాగా బలపరుస్తోంది. ఆనాడు సాయంత్రం జయగారి ఇంటికి వచ్చింది. శీనన్ కాదని డిఫెన్సువారు చూపలేకపోయారు.

ఈ కేసులో వాస్తవమైన విషయాలపైనా, స్వయంగా తెలిసిన సాక్షులపైనా మాత్రమే ప్రాసిక్యూషనువారు ఆధారపడ్డారు. ఉళ్ళోలేమని చెప్పటానికి సాక్షులను దేవటానికి డిఫెన్సువారికి ఇంత కాలం పట్టిందన్నమాట కూడా మరవకండి. సేలంలో 7 వ తేదీనే కృష్ణన్‌కు ఉత్తరం చేరినట్లయితే అప్పుడే ఎందుకు చెప్పలేదు? రశీదును చూస్తే ఫలానవాడికి ఫలానవాడు పంపాడని తెలియదు. ఫలానవాడు పంపాడని డిఫెన్సుకే తెలియాలి. తిరువేంగడం ఉత్తరం వచ్చిందేమో తనకు తెలియదన్నాడు. అకనాలెజిమెంటు రశీదు చేరిన మనిషి ఎవడైనా వచ్చి సాక్ష్యమిచ్చాడా? ఒక ఉత్తరం వస్తే వచ్చి యుండవచ్చు. అది 7 వ తేదీనే తీసుకోవాలని ఏమి? 7 వ తేదీ రాత్రి బ్లూ మౌంటెన్ ఎక్స్‌ప్రెస్‌లో వెళ్లి సేలం 8 వ తేదీ చేరవచ్చు. ఆనాడు తీసుకొని ఉండవచ్చు. పోస్టుమన్‌కు బాగా తెలిసినవాడైతే అది సామాన్యంగా జరిగేదే. అరశీదుమీద ముద్ర తిన్నగా లేదు. అందువల్ల ఆరశీదు నమ్మదగిందకాదని విన్నవిస్తున్నా.

సౌండ్ ఇంజనీరు పిళ్లై 8 వ తేదీన రికార్డింగ్ జరిగిందన్నాడు. 7 వ తేదీన రిహార్సలు జరిగిందనటానికి రికార్డేమీ చూపలేదు. 6 వ తేదీన జరిగినా చాలు. భక్త హనుమాన్ చిత్రంతీసిన డైరక్టర్ రామన్ గాని, కెమెరామన్ బెయిజ్ 7 వ తేదీన కృష్ణన్ షూటింగ్ చూడటానికి వచ్చాడన్నారు గాని రికార్డు చూపలేదు. కాలి రత్నాన్ని మటుకు సాక్ష్యానికి పిలిచారు కాదు. థియేటర్సువాళ్లు కృష్ణన్‌పై అక్టోబరులోనూ 30 వేలు ఇచ్చించారు. అసంగతి కృష్ణన్ డయిరీయే చెబుతోంది. 3, 4, 6, 7, 8 ముద్దాయిలపై కుట్ర నేరంగాక, సాల్యకు మద్దతు ఇచ్చిన నేరమూ, వడివేలూ, నాగలింగంలపై హత్యానేరమూ ఉన్నాయి.

## జడ్జి ప్రసంగం

కేసు వివరాలనుగూర్చి జ్యూరీ వారికి జడ్జి యీవిధంగా చెప్పారు. లక్ష్మీకాంతాన్ని నవం 8 తే పొడిచిన కారణంగా మర్నాడు మరణించాడు. 7 గురు ముద్దాయిలు ఎందుకు కుట్రచేశారని ఆరోపణ. 1, 2 ముద్దాయిలు హత్యచేశారనీ, రెండో ముద్దాయికి, మొదటి ముద్దాయికి ఉన్న ఉద్దేశ్యమే ఉన్నది. 3, 4 ముద్దాయిలు డబ్బుపెట్టి మద్దత్తు చేశారని 6, 7, 8 ముద్దాయిలపై కాపలా కాశారని ప్రాసిక్యూషనువారి ఆరోపణ.

కుట్రచెయ్యటం, మద్దత్తుచెయ్యటం రెండు విడదియ్యలేని నేరాలని అడ్వొకేట్ జనరల్ గారు వ్యంగ చెప్పారు. న్యాయవాదులు సాక్ష్యాన్ని సూక్ష్మదర్శినిపెట్టి, పరిశీలించి ... స్తనశల్యపరీక్షచేసినందువల్ల నాభారం తగ్గిపోయినది. ఇక ఉపోద్ఘాత మీకు అసలు విషయాలనే చెబుతాను.

ముఖ్యంగా కేసును ఋజువుచెయ్యవలసిన భారం ప్రాసిక్యూషనువారిది. సందేహానికి తావులేకుండా నేరాన్ని ఋజువుచేశారా అని మీరు ఆలోచించాలి. ఒకముద్దాయి ఊళ్లోలేనని చెప్పినప్పుడు లేవనే ఋజువుభారం డిఫెన్సువారిదే అందువల్ల ప్రాసిక్యూషను వారిభారం లేశమైనా తగ్గదు. 5 వ ముద్దాయిని గుర్తించిన విషయమే 3 వ ముద్దాయికి వర్తించాలని డిఫెన్సువాదం. 4 వ ముద్దాయి ఊళ్లో లేరన్నది తర్వాత పెట్టారు. ముద్దాయిలు ఊళ్లోలేరన్నది సరిగ్గా డిఫెన్సులో ఋజువు చెయ్యలేకపోయినంతమాత్రాన ప్రాసిక్యూషనువారు నిస్సందేహంగా కేసును ఋజువు చెయ్యవలసిన అవసరం లేకపోలేదు. ఇక్కడ పొరపాటుపడటం సహజం. మీరు మటుకు పొరపాటు పడరాదు.

## వైద్యుల సాక్ష్యం

లక్ష్మీకాంతాన్ని ఎవరు పొడిచారన్నది ప్రశ్నకాదు. ఎవరు పొడిచినా ఆ దెబ్బవల్లే చచ్చిపోయాడా అని మీరు విచారించాలి. డా॥ శ్రీనివాసులు నాయుడును నేను స్పష్టంగా అడిగిన డా॥ బాలకృష్ణన్ శస్త్రప్రయోగంవల్లమాత్రమే పింగానికి దెబ్బలేగిలి యుండదనీ, కత్తిదెబ్బవల్లే తగిలిఉండాలనీ చెప్పాడు. డా॥ బాలకృష్ణన్ తను లక్ష్మీకాంతంమాత్రం శస్త్రచికిత్సపూర్వం పరిశీలించలేదన్నారు. అంతకు పూర్వమే పరిశీలిస్తే అప్పుడే అందులో నెత్తురు కనిపించేదేమో నన్నాడు. గాయాన్ని పరిశోధించటంతప్పితే డా॥ బాలకృష్ణన్ శస్త్రాన్ని బాగా ప్రయోగించాడనటం సత్యంకాదని డా॥ మంగేశరావు చెప్పారు.

డా॥ జోసఫ్ చూసిన కొంతసేపటికి అతను ప్రశ్నలకు సరిగ్గా సమాధానం చెప్పటం లేదని డా॥ బాలకృష్ణన్ లు చెప్పారు. పోస్టుమార్టం సర్టిఫికెటులోని ఒక్కమాట పట్టుకొని శస్త్రప్రయోగం మాత్రమే పింగానికి కోసిందనరాదని నాయుడు చెప్పారు. లక్ష్మీకాంతాన్ని హత్య చేశారు. అందులో సందేహంలేదు. అతను వెంటనే చావకపోయినా మన్నాడు చనిపోయినా హత్యానేరం క్రిందేపరిగణించవచ్చు.

తర్వాత ఈగాయంఫలానకత్తితో పొడవబడిందనీ, గాయం ఎవరుచేతిలో కంటూ పోయరదనీ చెప్పారు. మీకు తీవ్రంగా గాయపరచిన నేరం సందర్భంగూడా నేను చెబుతాను. అది హత్యానేరం క్రింద రాదు.

## లక్ష్మీకాంతం చరిత్ర

లక్ష్మీకాంతం చాలా విచిత్రపు మనిషి. ఫోర్జరీకి హైకోర్టులో శిక్ష పడ్డప్పుడే ప్రసిద్ధికెక్కాడు. జెయిల్లో ఉండగా బయటఉండే స్త్రీపురుషుల వర్తనం మరీ చెడిపోయిందని కనుక్కున్నట్లున్నాడు. (నవ్వు) బయటికి రావటంతోనే రెండు పత్రికలు ద్వారా భారతనారీ లోకోద్ధరణకు కంకణంకట్టుకున్నానని ముఖ్యంగా సినిమా ప్రపంచంవారిపైనా ఇతర రంగాలవారినిగూర్చి కొంగారుతూ వ్రాస్తూవచ్చాడు. ఈ సందర్భంలో ఇతనిప్రాతలే సాధించదలంచినిగాగ ఎవర్నరు గారికి కొంతమంది దరభాస్తు చేశారు. అందులో 3, 4 ముద్దాయిలూ ఉన్నారు. అతనిమీద విరోధభావం ఉన్నవారు చాలమంది ఉండవచ్చు. అందులో వీళ్లూ ఒకళ్లే. లక్ష్మీకాంతం జీవితమంతా లోకానికి సంకటమైపోయాడు. చాలామందికి కంటకమయ్యాడు. అయినా ఆటవిక శాసనం చెలరేగిందంటే వ్యక్తి స్వాతంత్ర్యం నష్టపడ కలుగుతుంది. ఇల్లాంటి లక్ష్మీకాంతాలకేనాక మలంపడో వ్యక్తి శరీరానికి అవసరం.

## కుట్రగాథ

కోర్టువారు మరల సమావేశమైనపుడు జడ్జి ఇల్లా సాగించారు:—

కుట్రనుగూర్చి జయానందం సాక్ష్యం విచారిద్దాం. క్రిందికోర్టులో చెప్పిందంతా అబద్ధమనీ తనకేమీ తెలియదనీ ఇక్కడ చెప్పాడు. వాల్టాక్సు థియేటరులో 7 వ తేదీ సాయంత్రం కుట్రజరిగిందనీ, 1, 2, 3, 4, 6, 7, 8, ముద్దాయిలు కమలనాథన్ పాల్గొన్నారనీ అక్కడ చెప్పాను. తన చెల్లెల్నిగూర్చి లక్ష్మీకాంతం అసభ్యంగా వ్రాశాడు. గాబట్టి నేను కూడాపగపూనానన్నాడు. దానిప్రకారం 8 వ తేదీన హత్యజరిగిందన్నాడు. అప్రూవరు ఎదురు తిరిగితే క్రి. ప్రొ. కోడు ప్రకారం క్రింది కోర్టులో చెప్పింది చెల్లుతుంది. అయితే జ్యూరీవారు క్రింది కోర్టులో అతను చెప్పింది నమ్మ్ర తారో దీన్ని నమ్మ్రతారో నిర్ణయించుకోవాలి. ఇది మీరేమీ స్వకపరీక్ష. అతను ఎదురు తిరిగినందువల్ల 3, 4, 8 ముద్దాయిల సందర్భంలో బలపరచే సాక్ష్యంలేదు.

## జయానందం సాక్ష్యం

జయానందం సాక్ష్యం మొత్తం మీద నమ్మదగిందా అని ఆలోచించాలి. కమలనాథన్ అన్నీ పన్నాగాలు జరపాడని అతను చెబుతున్నాడు. కమలనాథన్ అదికాదంటున్నాడు. కమలనాథన్ కుట్రదారనీ సాక్షిబోనులో ఉంటే ప్రాసిక్యూషనుకు ఎక్కువ ప్రయోజనకారి అనీ డిఫెన్సువారి అభియోగముగా ఉంది. కమలనాథన్ ముద్దాయిగాకన్న సాక్షిగా ఎక్కువ ప్రయోజనకారి అని ఇల్లా చేశారని నేను అనుకోను. జయానందం సాక్ష్యానికి 1, 2, 6, 7 ముద్దాయిల సందర్భంలో ఇతరమైన ఋజువు ఉన్నది. జయానందం సాక్ష్యం ప్రధానంగా నిజమనుకుంటూ, నా అనుమానాలు నాకు ఉన్నాయి. సరియైన ఋజువు ఉంటేనేగాని సహకుట్రదారుని సాక్ష్యాన్ని మీరు అంత ప్రమాణంగా స్వీకరించరాదు. జయానందం కమలనాథన్ సాక్ష్యాలకు పొంతన మీరు గూడుకోవాలి.

## సాక్ష్య పరిశీలన

జయానందం అక్కడ ఉన్నాడని మునుస్వామి చెప్పారు. వడివేలు, శీనన్ రాజబాదరులను గూర్చి ముత్తుకృష్ణనాయుడు, కమలనాథన్ మున్నగువాళ్ల సాక్ష్యంఉంది. గోపాలస్వామి శెట్టి సాక్ష్యం చాలా అదృష్టంగా ఉంది. డిఫెన్సువారి క్రాసుపరీక్ష. సాక్ష్యమూ చూస్తే చాలా సుతిమెత్తని ప్రదేశంలో ఉండినట్లు కనిపించింది. చీఫ్ ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుకు జయానందం స్వదస్తూరీతో ఉత్తరం వ్రాశాడు. సబ్ డివిజనల్ మేజిస్ట్రేటుకు యెదుట వాఙ్మూలం ఇచ్చాడు. క్రింది కోర్టులో సాక్ష్యం ఇచ్చాడు.

ఇది చాలా భాగం నమ్మదగిందంటానికి సందేహం లేదు. బుద్ధిపూర్వకంగానే వాఙ్మూలం ఇస్తున్నావా సాక్ష్యకు శిక్ష పడుతుందని తెలిసే ఇస్తున్నావా అని మేజిస్ట్రేటు అడగగా అవునన్నాడు. అలాని కథ సగం సత్యమో అంతా సత్యమో డిఫెన్సు ఏమంటున్నారో వారి అంతర్యమేమో నాకు బోధపడలేదు. అతను చెప్పిన వాఙ్మూలాలన్నీ చూస్తే కంఠస్థం చేసినట్లు అతడు ఎక్కడ ఉన్నదీ తెలియనివాడిలాగా చెప్పారు ఇతర సాక్ష్యాన్ని మాపందే అతని సాక్ష్యంపైనే ఆధారపడి ముద్దాయిలు నేరస్థులనరాదు.

## ఎంతవరకు నిజము?

జయానందం ఇచ్చిన వాఙ్మూలాలు అన్నీ అలని కల్పనేనా? పోలీసులు వాటిని బాగా కనిపించేట్టు చేశారా, అతని కేమీ తెలియదా అన్న విషయాలు జాగ్రత్తగా మీరు ఆలోచించాలి. 3, 4, 8 ముద్దాయిలస్థితి వేరు అనీ, జయానందం చెప్పిందాన్ని ఇతరు లెవ్వరూ బలపరచ లేదనీ, అందువల్ల జయానందం మాటనుమాత్రం పట్టుకొని మీరు అతను నేరస్థుడనటం లా ఒప్పుకోరు అంటాను.

## 3 వ తేదీ విచారణ

అడ్వొకేట్ జనరల్:- 3, 4 ముద్దాయిల సందర్భంలో రామన్న సాక్ష్యం మీద నేను ఆధారపడటంలేదు. రామన్న సాక్ష్యం వీళ్లకు వర్తించినంతవరకు ప్రబల సాక్ష్యంకాదు. జయానందం సాక్ష్యాన్ని ప్రబల సాక్ష్యంగా పరిగణించవచ్చు. అయినా రామన్న సాక్ష్యాన్నీ తృణీకరించ అవసరంలేదు.

కోర్టువారు:- వారిమీద కుట్ర, మద్దత్తునేరం అన్నారుకాని కుట్రయే ముఖ్యమైన నేరం. జయానందం సాక్ష్యం ఇతర సాక్షులు ఎవ్వరూ బలపరచలేదు. అందువల్ల దాన్ని తీసుకొని వారిని అపరాధులని తేలుటేదు.

తర్వాత జడ్జి జ్యూరీవారికిల్లా చెప్పారు: కమలనాథన్ సాక్ష్యం ఒక్కటే కొంతవరకు 3, 4 ముద్దాయిలనుగూర్చి చెబుతోంది. కమలనాథన్ సహకుట్రదారుడని జయానందం చెబుతున్నపుడు సహకుట్రదారుని సాక్ష్యంపై ఆధారపడి అపరాధులని మీరు నిర్ణయించరాదు.

8 వ తేదీ ఉదయం పరసువాకం హైరోడ్డున మిలిటరీహోటలునుంచి బయటకు వస్తాంటే శీననూ రాజబాదరూ అక్కడ ఉన్నారనీ వడివేలువచ్చి కలిశారని ముత్తుకృష్ణనాయుడు చెప్పాడు. అతను పొడిచాడు అని అనగా ఫలానివాడని నాకు తెలిసిపోయిందని వర్గుణం చెప్పాడు. అక్టోబరు 19 వ తేదీన వడివేలు పొడిచాడనే కంప్లెయింటు ఒకటి ఉన్నమాట వాస్తవం. అయితే పెరేడులో వడివేలు గుర్తింపబడలేదనీ అందువల్ల ఆ హంశాన్ని అంతగా సరకుజెయ్యక అతనికి అనుకూలంగానే మీరు ఉపయోగించవచ్చు.

## గోపాల్ సాక్ష్యం

ఒకమనిషి రిక్షాను తోశాడనీ రెండోవాడు పొడిచాడని రిక్షావాడు స్పష్టంగా చెబుతున్నాడు. లక్ష్మీకాంతాన్ని అతను రిక్షాలో తీసుకుపోయిన మాటకాదనీ ఎవరూ ఋజువుచెయ్యలేకపోయారు. మళ్లీ వచ్చేప్పుడు నీ రిక్షాను వదిలి ఎక్కడికో పోతూవుకనా అంటేకాదన్నాడు. వచ్చి పొడుస్తూంటే నువ్వెప్పగించి చూస్తున్నావా అంటే నారిక్షా, రిక్షాలో ఎక్కినవాడు దెబ్బతిని పడిఉండగానూ ఎక్కడికి పోతానని నదురు చెదురు లేకుండా చెప్పాడు. డిఫెన్సు న్యాయవాదులెన్ని ప్రశ్నలువేసినా అక్కడనుంచి వాడు కదలలేదంటున్నాడు. పారిపోయినవాడైతే రెండు నిముషాల్లో తిరిగి రాగలడా? వర్గుణం రిపోర్టరుకు ఇచ్చిన ఇంటర్వ్యూలో రిక్షా క్రిందపడిఉన్నదనీ, రిక్షావాడు అక్కడ లేడనీ చెప్పింది నిజంకాదన్నాడు. ఇక రిపోర్టరు సాక్ష్యానికి ఇవ్వవలసిన విలువ మీరు ఇవ్వవచ్చు. ఇక వడివేలును గుర్తించటానికి జరిగిన పెరేడు గూడా పకడ్బందీగానే జరిగిందిగాని తప్పు పట్టటానికి ఆస్కారంలేదని రికార్డువల్లా, మీ ఎదుట ఉంచిన సాక్ష్యంవల్లా బోధపడగలదు.

## హంతకుల జాడలు

ముత్తుకృష్ణనాయుడు, మదన్ గోపాల్ చిట్టిబాబు, మునుస్వాములు ముద్దాయిల జాడల ఎప్పటికప్పుడు కంప్లెయింటు కట్టినట్లు వర్ణిస్తూవచ్చారు. వాళ్లు అల్లా వర్ణించినపుడు అది స్వీకరించ తగిందోకాదో మీరే నిర్ణయించుకోండి. లక్ష్మీకాంతం కంప్లెయింటు స్టేషన్లో ఇచ్చినట్లు బ్రూ, చిన్నప్పయ్యలు సాక్ష్యంఇచ్చారు.

ఈ కేసులో లక్ష్మీకాంతం కంప్లెయింటు వ్రాసుకున్న సబ్ ఇన్‌స్పెక్టరు నంబియార్‌ను అంతాబాగా దుయ్యబట్టుకున్నారు. అతను జనరల్ డయిరీలో వ్రాసిన ఎంట్రీని ప్రశ్నించారు. కాని అతను రిక్షా కమ్మిమీద కాలువేసి అట్టవస్తు పెట్టుకొని కంప్లెయింటు కాగితం మీద వ్రాసుకున్నానన్నాడు. వ్రాసుకుంటే చూశామని బ్రూ చిన్నప్పయ్య చెప్పారు. అసలు ఆ కంప్లెయింటు తర్వాతమెంది కాదనీ, అయినా అందులో సవరణలు చాలా జరిగాయని డిఫెన్సువారన్నారు. సవరణలు చేసినా అసలు కంప్లెయింటు అర్థమైనా ఎక్కడికి పోతుంది. ఆ ప్రకారంమైతే వడివేలు రిక్షాతోకాడు. పూర్వోకడు 30 ఏళ్లవాడు పొడిచాడు అని నాగలింగంపాలవాడని లక్ష్మీకాంతానికి తెలుసునో తెలియదో అని కమలనాథన్ అన్నాడు. నాగలింగాన్ని పెరేడులోతిన్నగా గుర్తించలేదని నాగలింగం న్యాయవాది అన్నాడు. మునుస్వామి నాగలింగాన్ని గుర్తించాడు. మునుస్వామి తానుబ్రోసు అన్నాడు. వాళ్లనమ్మరాదన్నాడు. కాని మీరికఫలో ముద్దాయిలపై కేసుకు మద్దత్తుగ ప్రాసిక్యూషనువారు ఆధారపడవలసిన అగత్యం ఉన్నదా అని ఆలోచించాలి. అతను చెప్పిందే వాస్తవమైనదిగా నాకుతోస్తుంది. మదనగోపాలూ చిట్టిబాబూ జయానందం, నాగలింగం, రాజాబాదరులు పరుగెత్తుతుంటే స్వయముగా చూశామంటున్నారు. ఆనాడు సాయంత్రమే మదనగోపాల్, చిట్టిబాబూ, వర్గుణం ఇంటికివెళ్లి చెప్పారు. మునుస్వామి తాను చూచిన వాళ్లలో చామంచాయ వాడొకడు ఉన్నాడన్నాడు. అదిద్రావిడులని చెప్పిన దానికి అంతి తెగని అవసరం. క్రైస్తవులైనా, ఆదిద్రావిడులైనా అంతపట్టింపు అనవసరం. రాజబాదర్, జయానందాలు క్రైస్తవులు కావటంతో, ముత్తాలో క్రైస్తవమతం పుచ్చుకుంటే వీరి రూపురేఖల్లో ఆదిద్రావిడవాలకాలు పోతాయనుకోవటం భ్రమ. సాక్షులు చెప్పిన గుర్తులు, గుర్తింపుచేసిన విషయం గుర్తులో ఉంచుకోదగినవి.

## రామన్న సాక్ష్యం

8 వ తేదీన శీనన్ వచ్చి తనతో చెప్పిన గాథను రామన్న చెప్పాడు. జయగారి శీనన్ వచ్చినపుడు కొంచెం మనిషి కలత చెందినట్లు కనిపించాడని చెప్పింది. చంపి వచ్చామని చెప్పిన శీనన్ కబురుకు రామన్న భయపడిపోయానన్నాడు. శీనన్‌కు సంబంధించినంతవరకూ జయానందం చెప్పిన దాన్ని రామన్న బలపరచేదాడు. పైగా రామన్న సేలం వ్రాసిన ఉత్తరం ఉంది. ఇద్దరు అసామీలు ఓ. ఎస్. ఎల్‌ను జనరల్ కాలినుగోడ్లోలో పొడిచినట్లు ఫలానీవాడు (పేరులేదు) వచ్చి చెప్పాడని దాని తాత్పర్యం. మరో సాక్ష్యం గూడా దీనికి ఆధారం.

# ఫ్రిస్కో సమాలోచనలు

## మిలిటరీ విషయాలు

సాన్ ఫ్రాన్సిస్కో సభా ప్రతినిధులు రెండు మిలిటరీ విషయాలు తేల్చుకొనవలసి ఉన్నదని సాన్‌ఫ్రాన్సిస్కోలో మకాం చేసిన న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూన్ వ్యాఖ్యాత మేజర్ జార్జి ఫీల్డింగ్ ఎలియట్ వ్రాస్తున్నాడు.

ఒకటి పోలండు సమస్య, రెండోది పసిఫిక్ దీవుల ధర్మకర్తృత్వ పాలనా విషయము. ఎలియట్ ఇలా వ్రాస్తున్నాడు. మిలిటరీ అంశాలు విచారించవలసి ఉంది. బహుళశః వాటి వ్యాప్తి సామాన్యంగా గ్రహింపు కాకపోవచ్చును. ఉదాహరణకు చిక్కుగాఉన్న పోలండు సమస్య చూడండి. లుబ్లిన్ సంఘాన్నే పోలండు తాత్కాలిక ప్రభుత్వంగా రష్యా పరిగణించటం కేవలం మిలిటరీ హేతువులవల్ల చెల్లుతుందని నాకనిపిస్తున్నది. రష్యా లుబ్లిన్ సంఘాన్నే పోలండు ప్రభుత్వంగా పరిగణించినపుడు రష్యా సేనలు పెద్ద బలగంతో పోలిష్ భూమిమీదుగా కదిలిపోసుంటెను. ఆ అభిగమనం మిలిటరి సందర్భాన్ని బట్టి జరగవలసిందేకాని రాజకీయ బాధ్యతలవల్ల ఆలసించేదికాదు. రణభూమికి వెనుకతట్టు ప్రాంతాల సివిల్‌పరిపాలన స్నేహపూరితంగా ఉండాలని రాకపోకల మార్గాలు భద్రంగా ఉండాలని ఉత్తరఆఫ్రికాలో బ్రిటిష్, అమెరికన్ సైన్యాలు అపేక్షించినట్లే పోలండులో రష్యను సేనానులున్నూ అపేక్షించటం ఆవశ్యకమే అవుతుంది. మన సేనాపతులు ఈ ఉద్దేశంతో ప్రవర్తించారు. తరవాత రాజకీయంగా వారి చర్యను తీవ్రం విమర్శించటం జరిగింది. కాని తలపెట్టిన మిలిటరీ ప్రయోజనం సార్థకమైంది.

అలాగే పోలండు మీదుగా పడమట్లు సాగుతూ దాడిప్రారంభించేముందు రష్యా సేనాపత్యంవారు తమ రాజకీయ అధినేతలకు ఇలా చెప్పి ఉండవచ్చును. గమ్యములు తొక్కుకు పోయే మేరలో, సరఫరాలు గవాణాచేసి పంపవలసిన ఆ ప్రాంతంలో సివిల్ వ్యవహారాలు పరిపాలించటానికి పోలిష్ ప్రభుత్వం అవసరమని అలా ప్రభుత్వం ఏర్పరచేందుకు వెంటనే యేమన్నా చేయవలసిందని వారు విన్నవించి ఉంటారనుకోవచ్చును. దీని పర్యవసానం ఉత్తర ఆఫ్రికాలోని దీర్ఘపర్యంత రాజకీయప్రయోగం కన్న సుష్ఠుకాకపోవచ్చును. కాని కేవలము స్వల్పకాలీనమైన మిలిటరీదృష్ట్యా డార్లను ఉత్తర ఆఫ్రికాలోను లుబ్లిన్ పోలండులోను సవ్యంగానే నడిచినవి సైన్యానికి అంతవరకు వించిన ఆలోచన ఉంటుందనుకోను.

అలాగే పసిఫిక్ దీవులను ఇతర కలహప్రాంతాలను ధర్మకర్తృత్వపద్ధతిని పాలించాలనే విషయం ఎంతో చర్చించారు.

అమెరికాకు ముందు ముందు ముప్పం కేసుండా శ్రమపడిపించేందుకున్న ఓడిపోయిన జపానును గస్తీకాసేందుకున్న పసిఫిక్ ప్రాంతంలో వీలైనవి మూల నివేశాలు సంపూర్ణంగా స్వాధీనమై యుండాలని మన నౌకాధిపతులు ఆత్రపడింది ఎందుకో గ్రహించుకోవచ్చును. అంతర్జాతీయంగా యుండేటు ప్రాంతంగాఉంటేగాని లేక నివిధంగా అంతర్జాతీయ పరిపాలన ఉన్నా, మిలిటరీచర్యలకురాజకీయాలుఅడ్డు తగులుతూవుంటుందనినౌకాధిపతులభయము— అందుకనే వారికి ధర్మకర్తృత్వం అనేది నచ్చదు. పసిఫిక్‌లో అవసరమయే మూలస్థానాలు అమెరికావశాన ఉండటానికి ఇష్టపడనివా రెందరో ఉండరు.

అట్లాంటిక్ శాసనంలో ప్రాదేశికమురా గ్రమణ తగదు అని చెప్పిన దానికి భంగం లేని రీతిని పైన చెప్పిన నియంగా వ్యవహరించినిమేలాగో ఒక సూత్రం ఏర్పరచాలి.

ఈ ఫ్రిస్కో సభవారు విచారించ వలసిన మిలిటరీ విషయాలకు ఈ రెండున్నూ దృష్టాంత పూర్వకంగా చెప్పాను. మిలిటరీ నాయకులు యుద్ధ వ్యవహారాల్లో నిమగ్నులై యున్నారు. కనుక ఫ్రిస్కో సభలో వారంతగా కనిపించటంలేదు కాని పెద్ద రాజ్యవర్గాల వారి నిరంతరం మిలిటరీ సలహాదార్లను సంప్రదిస్తూ రాజకీయ మిలిటరీసమస్యలను వ్యవహార యోగ్యంగా పరిష్కరిస్తూ ఉంటారనేది నిస్సంశయంగా చెప్పవచ్చును.

## బొంబాయిలో ఆంధ్రసంఘాలు

బొంబాయిలో శ్రీ ఉపద్రష్ట నరసింహారావుగారి యాజమాన్యాన బొంబాయి నగర తెలుగు కార్మికుల నిమిత్తం రెండు ఆంధ్రసంఘాలు (వర్లీ ఆంధ్రజనసంఘం, పరేల్ నయగావ్ ఆంధ్రజనసంఘం) స్థాపించబడినవి. గోవిందరావు రాఘవరావుగారి అధ్యక్షతన ప్రారంభోత్సవం జరిగింది.

రామన్న సాక్ష్యాన్ని ఈ సత్రనుబలపరుస్తోంది. రామన్న సాక్ష్యం మీరు అంగీకరించేట్లయితే శీనన్ అపరాధి అని మీరు నిర్ణయించటానికి ఆక్షేపణ ఉండరాదు.

## డిఫెన్సు సాక్ష్య పరిశీలన

మీరు ప్రాసిక్యూషను సాక్ష్యాన్నెంత శ్రద్ధగా పరిశీలిస్తారో డిఫెన్సు సాక్ష్యాన్ని కూడా అంత జాగ్రత్త.



శివలెంక శంభుప్రసాదు గారిచేత ఆంధ్రపత్రిక, శ్రీ బాలా ప్రెస్సులు, నెం. 202, బొంబాయి.

